శ్రీ

# కర్ణామృతము

అను

# శృంగార పద్యావళి.

## ప్రథమ భాగము.

శా॥ శ్రీవైకుంఠనివాసుఁడైన హరి, ల ♦ చ్చిన్ జేరబిల్పించి బల్
ఁవిచ్చెంతకుఁ జేరి, కౌఁగిటను, న ♦ ట్టేజేర్చి కేళీగృహం
బావేశన్వడి జేర్చెనంట, భళిరే ♦ యావిష్ణువెల్లప్పుడున్
నావయ్యారిని బ్రోచుగావుతమహిన్ ♦ యానందసంధాయియై

చ॥ మనసును పట్టజాలకను ♦ మానిని, నిగ్గనిహస్తసంజ్ఞ చే
తను, పదిరూప్యములిన్నిశకు ♦ తథ్యము సంగెదనంచు జెప్ప నీ
జననియనుజ్ఞయున్వ్రసి ♦ చయ్యనదాకడ కేగుదెంచియున్
సునిశిత నేత్రతూపులను ♦ చూపులు నాపయి జూపకోమలీ॥

మ॥ జగధీశున్ మరపింపజొచ్చెయికనీ ♦ జన్మంబునిగ్గాడకే
సగపాలైననుముక్తిజెందదనుచున్ ♦ సందేహమున్ జెందెయా
పగలేరాత్రిగదోచెకొంతఁడికిన్ ♦ భద్రంబుగన్ జూచితిన్
భగవంతుండిదిచూచునంచుమదిలో ♦ మానంగనే నెంచితిన్॥

చ॥ ఉదయమునంపె లేచిపొగ ♦ సొప్పగసొమ్ములుఁవిదాల్చి, తే
వదనముముద్దుగుల్కుతన ♦ వస్తువులిచ్చుటదాచినట్లుగా
పదపడినేగుదెంచి, నిలు ♦ ఁగనుచెంగట నేమిచెప్పుదున్
హృదయముపారెనీరుగను ♦ గనుతొల్లిటిబుద్ధియగ్నియై॥

చ॥ ధనమునుగంటనిమ్ము కుల ♦ ధర్మముకాదనిచెప్పనిమ్ము లో
కనుగొని తల్లిదండ్రులిది ♦ కాదని బుద్ధినిచెప్పనిమ్ము యిం
ట్లనుమడిమాన్యముల్ జగతి ♦ గోకులపాలయిపోవనిమ్ము తా
దనియగనెంచుకాంతగను ♦ దాకనుడెందముతృప్తిజెందునే॥

మ॥ సతి, నీతల్లికిజెప్పకుండగనుయీ ♦ సద్వర్తనంబున్,యహం
కృతి జేయుంగనుశక్తియున్న పిలువన్ ♦ కేళీవిలాసక్తికిన్
మతిసందేహములేక వచ్చెదనుజు ♦ మ్మాయన్నయాపల్కు
కున్
నతికోపంబును దెచ్చుకొంటివిమదిన్ ♦ యాహాసతీరత్నమా॥

ఉ॥ చేతులత్రిప్పుకొంచు, మన ♦ సేతలుతల్లికిజెప్పకుండ, నే
రీతిగజక్కనైననిన ♦ "లేకనుపోయినమానెగాక, నీ
మాతకుజెప్పినన్ వినుము ♦ ప్రాణముపోయిన రానటన్న" కో
పాతిశయంబుచేతగని ♦ పారితి వింటికి టెంగురంగుగన్
బూతులనాడకోకుసుమి ♦ పుట్టినబుద్ధిది రిత్తపోవునే॥

ఉ॥ అచ్చుగనప్పుడేజనని ♦ కంతయుజెప్పితి చెప్పినాత, రా
వచ్చునటంచుపల్కనిక ♦ మానసమందునచింతయేల నీ
కిచ్చజనింపదేలమహీ ♦ కీర్తిపి వేగమెరాగదయ్యా, నా
ముచ్చటదీర్పుమయ్యా, యను ♦ ముద్దులపల్కటుపీడు డెం
దమున్॥

ఉ॥ మాటలులేనిపూర్వమున ♦ మాటికిమాటికిచెంతరాగ, నో
బోటిగొదొందుకోపనిని ♦ బూనిచరించితివంచునెంచ, యీ
లాటిచమత్ప్రియావాదుపు ♦ లందున వచ్చితివంచునాత్మలో
జోటిదలంపనైతికలు ♦ షుండనునీయెడద్రోహులన్ జమీ॥

ఉ॥ ప్రొద్దున మేలుగాంచి పాలు ♦ పొందగ పండ్లను దోము
కొంచు, యా
పెద్దయురుంగు రాతిపయి ♦ వేడుక గూర్చునియుంట జూచి యా
ముద్దియ గుమ్మమున్నిలిచి ♦ మోదమునన్వడి తొంగిచూడగా
యద్దిర చందమామయన ♦ యచ్చెరువయ్యెను జమ్ము చిత్త
మున్॥

ఉ॥ చూచిన నేమియా మొమది ♦ చోద్యనిధింబడి తేలనాడు, చే
జా నకాకపోయెనిక ♦ సంగమ మెప్పుడొ తోచదాయె, యే
తో నేమియా యొయిది ♦ తుచ్ఛప్రవృత్తనిఖాన నెంచ, నీ
చూ పులంబడుమ ♦ సుందరికన్నులు యెట్టికన్నులో॥

ఉ॥ గొబ్బున కార్యమేదాగాని ♦ క్రుమ్మరుచింటికి వచ్చినంతనే
తబ్బిబులాడిపోకుగాని ♦ తక్షణమొచ్చియు చెంత జేర, యో
యబ్బ, యిదేమిచోద్యమన ♦ యాడుచునుండె నపైటలోన ని
గుబ్బలకీయ వచ్చుపడి ♦ కుప్పలరత్నము లంబుజాననా॥

ఉ॥ యింటను తల్లి లేని యెడ ♦ యింతిరొ నిన్నును బట్ట శక్యమే
తుంటరివిల్లుకానికిం ♦ దుస్తరమౌ జయమి యెంతజాణవే
కంటిని యెత్తిజూడపర ♦ కాంతను మోమును యెట్టినన్ను
గంటను జూచిబుద్ధిఖుల ♦ గల్పితివయ్యరొ, యేమనందునే॥

ఉ॥ నీకడ కేగుదెంచుటకు ♦ నిక్కము బుద్ధిజనించెగాని, యొ
తోకతినాత్మరాలవలె ♦ తోచును జూచిన నీదుమాట, మీ
వాకిటరాను సందియము ♦ పల్మరు భావము జెందుచుండె, నీ
కైకపటంబు లేదుసుమి ♦ కాంతరొ కాగడగాల్చిగాంచినన్॥

చ॥ గృహమునయందునీజనని ♦ కిన్నగనియేదొవిధంబుచేత భీ
తి,హరణముంబొనర్పగను♦తొంచగయింకొకతుండవృద్ధ తో
త్తమా, గనినంతనేవినుము ♦ తన్వి వచించెదయేదొపెద్ద, దు
ర్గ్రహమనిభీతిదోచిపుద ♦ రంబుపటుక్కునవ్రక్కలౌజుమీ॥
ఉ॥ శీలనుబెంచెదగైకొనియు ♦ క్రీడవిలాసినివోలెసొమ్ములన్
లీలనుదాల్చి నీరు, యువ ♦ లీలనుతెచ్చుటబైలుదేర, నీ
వాలుమగంటిచూపులను ♦ బాపురె! చూచినపూరుషాళి వె
వ్వేలనునీదుదాసులయి ♦ యింటనుకుక్కలుగారె సుందరీ॥
చ॥ ధనమునుకాసజెందియును ♦ తారుచుకేరుచుసుంటివంచునా
మనమునఁనెంచితిన్ మొదట♦మక్కువనిక్కమెరింగితిన్ జుమీ
వనితరొనీదుమానసము ♦ వహ్వారె,వల్పులకుప్పొ,లేక, మో
హనవలపూరుభావికొయికో♦యాత్మదలంపగ లేనుకోయ్యకో॥
మ॥ధనముల్ పోయినపోవనిమ్మునిదుముల్ ♦తన్మాపరానిమ్ముకా
దని మిత్రుల్ వడిజెప్పనిమ్ము సతిన ♦ త్యంతార్తిచేదిట్టినన్
జనునే నీకని, తల్లిదండ్రులిలపై ♦ సద్బుద్ధులన్ జెప్పినన్
తనువున్ ప్రాణములుండ, నిన్గవయకన్ ♦ తన్వీవిడంబుత్తునే॥
శా॥ ఔరా యెంతటినేర్పుకత్తెవొకో, ని ♦ ద్రం జెందనీతల్లి, వే
పారంజూచియుముద్దుగుల్కనగునో ♦ వయ్యారిచందంబునన్
నారీచోరకుకేరియున్ సరసముల్ ♦ యాడించుదోనన్ను, స
త్కారంబేమనిమెచ్చుకొందుభళిరా♦కాంతాసతీరత్నమా॥
ఉ॥ భావమునందుమోహమొక ♦ వైఖరికన్నులవెంటజూపుచున్
భావమునందుగల్గుదయ ♦ భావముచేతనవెల్లడించుచున్
భావమునందుసర్సమును♦పల్కులచేతనుతృప్తిజేయుచున్॥
ఈవిధిచోరకేరినల ♦ యించెదవెప్పుడుసుందరీమణీ॥

ఉ॥ ముందటికాలమందు నను ♦ ముద్దియలందరిలోనరంభయే
యందమునందునీవియని ♦ యందురు నప్పటికాలమందు నీ
వుందువొ మానినీమణిరో ♦ యొప్పులకుప్పని జెప్పుకుందురే
మొందునుకాననట్టి జల ♦ జేక్షణయుంచునువాగకుందురే॥

చ॥ జగమునసుందరీమణుల ♦ చక్కదనంబునుతీసిముద్దగా
దగనొనరించినేర్పున వి ♦ ధాతనొకానొకస్త్రీని జేయగా
దిగియిటువచ్చినట్టియువ ♦ తీమణియో సురనారియో వచిం
పగధర యేరికిన్వశమె ♦ భామనుకన్గొనక్రొమ్మరుంగురా॥

మ॥ కలముల్ బట్టియునీదుయందముచమ । త్కారంబుపద్యంబుగన్
లలితొత్సాహముబుట్టవ్రాయదలచన్ । రంజిల్లునీమోహన
త్కళలెల్లన్ హృదయంబుచేరియును చి । త్తంబున్ వికల్పంబుగన్
గలగన్ జేయగసాగరాదుకలమో । క్రాల్గంటియేమందు నే॥

మ॥ ధరణీచక్రమునందుకీర్తిమయుడున్ । దాసాళివ్యాప్తిపరుడున్
సరసీజాక్షునివర్ణనల్ సలుపకా । సంతైనవీలుందు యో
తరుణీరత్నమనీదుయౌవనచమ । త్కారంబువర్ణింపగన్
తరుగన్నేరదు కాలమెంతయయినన్ । తన్వీ: జగన్మోహినీ॥

చ॥ సరసను జేరిముచ్చటలు । చక్కగచెప్పదొడంగినంత సం
బరమునముద్దుమోవిచిరు । పల్కులతోడయి తేనెలొల్కగన్
గరితరొతుమ్మెదల్విధము । కర్ణములిమ్ముడగ్రోలజొచ్చె నీ
సరసవచమ్ములుంగనిన । చానరొకోకిలగానమాజుమీ॥

మ॥ వెలకట్టంగనునీడుయందమునకున్ । వేల్వేలుగన్ దెచ్చి కు
ప్పలుపోయంగనుసాటియౌనె కలచె । ప్పన్నికసాధ్యంబె కో

మలి నీయందముకున్మదీయకృతియగా । మ త్తేభవృ త్తంబు ని
శ్చలతత్వంబుననిచ్చినాడగొనుల । కుల్ కోట్లుసేయుంజుమీ॥

ఉ॥ యాతలి జేతను పద్మభవు । డెన్నిదినంబులునూహ జేసి తా
జేసెను నేర్పుతోడ, సర । సీరుహనేత్రిని స్వర్ణగాత్రినిన్
యాసొగసెన్న యిజ్జగము । నందునచల్ల నిహాయినిచ్చు వ్య
త్యాసము లేకపాల్కడలి । నర్మిలిపట్టియనంగనొప్పెడిన్॥

చ॥ కలకలలాడునవ్వులును । కామునితూపులనంగచూపుల న్
కలువలరేనితో లెక్కియు । గంబునునీతగుయావనంబును న్
పలుకొకవింతడో చెడి సు । భాషితములనమన్మథుండు, త
న్చెలువనువీడబుచ్చితన । చేడియగ న్నినుచేరదీయడే॥

మ॥ మగువా నీకునుసాస్వమున్నలిపిరో । పల్వారులాలించి యో
తగురొక్కంబునునిచ్చిరో, హరినిచి । త్తంబందుప్రార్థించి
యో
తెగువన్ జేసిరొనిన్ను ముద్దుగొన్న । ధీనుంతుధన్యాత్ము డౌ
జగతిన్ వేరొకవానిత్యర్థుడనగన్ । చంద్రాస్యసందేహమే॥

చ॥ కనులకుదిద్ది కాటుక, యు । ఖంబునకస్తురిబొట్టువెట్టి న
న్ననిశశివన్నెచీరెనుదియు । యారముగన్ ధరియించిహారముల్
తనమెడనిండదాల్చి యిడ । త్రాచువిధంబునయాడ, నాసతీ
మణిజనుచుండెగాంచుమదె । మన్మథురాశిసమానవై ఖరిన్

ఉ॥ మొన్నటినిన్ను గాంచుదును । మొన్నడుకన్మనసారకౌగిటన్
గ్రన్నన జేర్చుకొందును, యి । కన్ చిరుమోవినిపంటనొక్క,
యిం
కెన్నడుభాగ్యమబ్బునొకో । యెన్నడునీ సుఖచందమామనా

కన్నులపండువౌనటుల। గాంతునోతోచదు కామినీమణీ॥

శా॥ నీమోహాంబుపాశబంధనముచే। నేర్పారనన్ బట్టి యో భామారత్నము, చెంతజేర్చుకొనగన్। వందల్ ప్రయత్నంబులన్ కామాసక్తిని జేయుచుంటివివృథా। కాలంబువోగొట్టుచున్ యేమాత్రంబును కాలువెట్టుదుమనం। బీవృత్తికిన్ సుందరీ॥

చ॥ అడవినిగాయువెన్నెలస। మానముగన్ చెలి యౌవనంబు నీ పుడమినిపాడు జేసుకొన। బోకుము వేరొకనిన్ వరించి నీ వడయుము సత్సుఖంబనిన। ప్రాణమునిప్పుడెతీసుకొందు నీ వొడ్డబట్టకుండినంచ నెడి। మోహపుపల్కులవీడ నేర్తునే॥

చ॥ వనితరొయిట్టికార్యముల। పట్టుననాకిసుమంతనిచ్చ లేదు, ననువృథాగపాపమున। ద్రోయకునాకిదివృత్తికాదనన్ చనువునదూర నెంచెదవు। చంద్రుని యింద్రునికన్న యెక్కువా య నెదవు యేమినీపలుకు। లద్భుతమాచుదలంతుకోమలీ॥

ఉ॥ అందని మ్రానిపండునకు। హస్తముజాచినరీతినీదగుం పొందులభించుటంచుదల। పోసితిగానిమనంబునందు యా యిందునితాల్పుసత్కృపను। యింతిరొనీదగుకూటమబ్బె యో సుందరిధన్యుడన్నయితి। జుమ్మిక యింద్రుడవైభవంబునన్॥

ఉ॥ కోపముజెంది నేకసరి। కొంచెమునావల త్రోసివేయు, ని కీపనిమంచిదా సఖుడ। నిన్నె మనంబున కోరియుంటి నా తాపముదీర్పుమాయికను। తాళ త్రిశుద్ధిగ నమ్ముమంచు నా కోపముదీర్పకష్టపడు। కోమలి నెట్టులవీడుదున్ మదిన్॥

చ॥ మునుపటిజన్మమందునను । పుణ్యము లెన్నియొ జేసియుంటినో
ఘన నియతిన్ వ్రతంబులను । గాంతుడలర్పగ నెన్ని జేసితో
గనుక నెయిట్టిసుందరిని । కౌగిట జేర్చ భాగ్యమబ్బె నుం
కనుననుబోలుపుణ్యునిక । గాంచగవశ్యమె యెందు చూచినన్

మ॥ సతి యిక్కట్టులుగల్గినన్ పురజనుల్ । సత్త్రోవ కాదంచు నా
ధృతిదూలన్ నయవాక్యముల్ పలికినన్ । తిట్టంగ సాగించినన్
హితవున్ బోధన జేసినన్ మరతునే । హృత్సీమ నేనిన్ను యీ
క్షితిపై ప్రాణముపోయినన్ సరియె నీ । స్నేహంబువీడన్ సఖీ॥

ఉ॥ నాలుగుమోములుంగలుగు । నాధునికైనను వేయినోరులం
బోలిన శేషుకైన సుర । భూపతికైనను నీదుయందమున్
మేలుగగాంచివారలును । మెచ్చ యెంచగ కన్నులన్ గనన్
జాలరునింక మర్త్యులవ । శంబె జగంబునసుందరీమణీ॥

మ॥ సకలైశ్వర్యముతో సుజవ్వనముతో । సంతానముల్ నూరుతో
యకలంకంబగునట్టి సౌమనసముతో । యాశ్చర్యసంశీలతో
సుకుమారత్వముతో బిగింపుగలనై । జూపట్టుపాలిండ్లతో
సకియా వర్ధిలు మేదినీతలముపై । సంతోషసంపూర్ణతన్

ప్రథమ భాగము.

సమాప్తము.

